# ఆత్మభారతం కృతి సమర్పణ

## కవిగారికి మంగళగిరి పౌరుల సన్మానము

మంగళగిరి, ఏప్రిల్ 2: ఆత్మభారతము గ్రంథకర్తలగు శ్రీ చిట్టా ఆంజనేయ కవిగారికి మంగళగిరి పౌరులు మొన్న అవధాన శిరోమణి మధ్వశ్రీ కాశీకృష్ణమాచార్యులు గారి అధ్యక్షతను సన్మానం జరిపిరి.

ఉదయం శ్రీ చిట్టా ఆంజనేయ కవిగారిని ఏనుగమీద కూర్చోబెట్టి, వారికి గజారోహణ ఉత్సవము పురమంతయు బ్యాండు సన్నాయిమేళములతో ఊరేగించిరి.

ఆత్మభారతము అను కావ్యమును సుగన్ధ పుష్పపూజ సలిపి కావ్యమును భగవానుడగు శ్రీ కృష్ణపరమాత్మకు అంకితము నొనరించిరి.

సన్మాన సభకు వివిధ ప్రాంతములనుంచి కవులు, పండితులు, చాలామంది వచ్చిరి.

సాయంత్రము మధ్వశ్రీ అవధానశిరోమణి శ్రీమాన్ కాశీకృష్ణాచార్యులుగారి అధ్యక్షత క్రింద సన్మానసభ జరుపబడెను.

అధ్యక్షులకు, కవిగారికి, పండితులకు, కవీశ్వరులకు ఆహ్వాన సంఘమువారి తరఫున శ్రీ దామర్ల రమాకాంతరావుగారు పుష్పమాలలు సమర్పించి సభా ఉద్దేశ్యములను గూర్చి ఉపన్యసించిరి.

శ్రీ తాడిపత్రి శ్రీ కంఠగారు సభను ప్రారంభించుచూ మన భారతదేశములో పూర్వమునుంచి కవులను పండితులను సన్మానించుట పోషించుట జరుగు ఆచారము రాజులు కవీశ్వరులను పండితులను పోషించుచూ మన శాస్త్రకళను వృద్ధి తెచ్చినారు. ఆదికవులు నన్నయభట్టు, ఎఱ్ఱాప్రగడ, శ్రీనాథుడు మొదలగు కవులు కావ్యములు రచియించి రాజుల మన్ననలను పొందిరి. మన పూర్వరాజులు తిరుమలరాజులకంటె ముందు కవీశ్వరులను పండితులను సన్మానించేవారు. రానురాను మన దేశము పరాయివారి ప్రభుత్వములో కవులకు పండితులకు ఆదరణ పోయినది. మనకు తిరిగి స్వాతంత్ర్యము వచ్చి ప్రజారాజ్యము ఏర్పడినది. ప్రజలు వారి ధర్మము వారు తెలుసుకొని కవులను పండితులను సన్మానించుచూ వారి పోషణను ఉపక్రమించినారు. మన కవిగారు భారతమును భగవద్గీతను సమన్వయపరచి వేదాంతపరముగా విమర్శించి ప్రజలకు ఆధ్యాత్మిక విజ్ఞానము కలుగజేయుటకు సులభశైలిలో ఆత్మభారతము రచియించినారు. భారతమును యీ వేదాంత విమర్శతో యిప్పటికి ఎవరు రచియించలేదు. కవిగారు యిట్టి గ్రంథమును ఆంధ్ర ప్రజలకు యిచ్చి ఆంధ్ర సారస్వతము, సాహిత్యాభివృద్ధికి మార్గదర్శకులైరి" అని ఆంజనేయ కవిగారిని ప్రశంసించిరి.

కవిబ్రహ్మ ఏటుకూరు నరసయ్యగారు ఆహ్వానసంఘము తరఫున అధ్యక్షులకు కవిగారికి సన్మానముచేసి యిరువదికి పండిత శాలువలు సమర్పించి కవిగారికి రు. 1116/-లు తో సన్మానించుచూ, పూర్వకవుల పద్యరచన కవిత్వము ఆధునిక కవిత్వమునుగూర్చి చెప్పిరి. "ఈ ఆత్మభారతము నన్నయ గద్య కవిత్వముగా వున్నది. భారతమును వేదాంత విమర్శముగా రచియించి ఆంధ్ర ప్రజలకు అందజేసిన కవిగారికి మనమంతా కృతజ్ఞత తెలుపవలయును. భక్తపోతనగారు భాగవతము రచియించుచూ భగవంతుడే మార్గదర్శియై రచియించినాడని తను నిమిత్తమాత్రుడనియు చెప్పిరి. యీకవిగారు తన శక్తి తెలియదనియు శ్రీ కృష్ణపరమాత్మయే, తనకు మార్గదర్శకుడైనాడని తను నిమిత్తమాత్రుడననియు, అందువలన కర్తయైన శ్రీ పరమాత్మకు అంకితముచేసినానని చెప్పిన అపరపోతనామాత్యుడు ఇది కవిగారి భక్తి, నిరాడంబరత్వమును చాటుచున్నది." అనిరి.

శ్రీమాన్ వేదాల తిరువెంగళాచార్యులు, శ్రీ వంగల శ్రీరామావధాని, జంపాల వెంకటనరసింహం, దాసరి బ్రహ్మయ్య చౌదరి శ్రీ వీకేశ్వరాచార్యులుగారు, గ్రంథకర్తగారిని ప్రశంసించుచూ ఆత్మభారతములోని వేదాంత సహితపాత్రలు, గర్భక్షేత్రమను సంసారసాగర భారము తరించుమార్గము ప్రజలకు ఆధ్యాత్మిక విజ్ఞానము కలుగజేయుచు గురువుల్లు గ్రంథమనియు ఉపన్యసించిరి. నాగేశ్వర గాయకులగు శ్రీ తెంపర్ల మాణిక్యము గారికి ఆహ్వానసంఘంవారు సువర్ణ పతకమును బహూకరించిరి.

శ్రీ చిట్టా ఆంజనేయకవిగారు తాను కవిగాను పండితులుగాను ఆ కృష్ణపరమాత్మ అనుగ్రహముచేత్ల భారతమును, భగవద్గీతను చదివి నేను నిమిత్తమాత్రుడనై యీ వేదాంతమార్గముగా భారతమును రచియించితి ననియు, ఆ పరమాత్మ చే మార్గమును చూపించబడి వ్రాసిన యీ ఆత్మభారతము శ్రీ కృష్ణపరమాత్మకే అంకితమొనరించినాననియు చెప్పిరి. అధ్యక్షులు యీ వేదాంత మార్గదర్శకమైన ఆత్మభారతమును చదివి ప్రజలంతా ఆధ్యాత్మిక విజ్ఞానముపొంది సత్య, ధర్మ మార్గా

ఫలంబు లభ్యునని కోరుచూ ఉపన్యసించిరి.

ఆహ్వాన సంఘమువారి అభివందనముల తోను నాగస్వర వాద్యములతో సభ సమాప్తి నొందెను. (స్వ. వి.)

# పామర్రులో హిందీ కళాశాల

## 1949 మేనుండి ప్రారంభము

మదరాసు, ఏప్రిల్ 2: హిందీప్రచార సభ విద్యాకార్యదర్శి శ్రీ యస్. ఆర్. శాస్త్రి బి.ఒ.యల్. గారిట్లు వ్రాయుచున్నారు.

హిందీలో ఉన్నతవిద్యను ప్రోత్సహించు ఉద్దేశ్యముతో, హిందీ విద్వాన్ కొరకు హిందీ కళాశాలను కృష్ణాజిల్లా పామర్రులో 1949 మేనుండి ప్రారంభించుటకు నిశ్చయించబడినది. ఈ కళాశాలలో హిందీప్రచార సభవారి "ప్రవీణ" పరీక్షా పాఠ్యక్రమమును అనుసరించి హిందీభాష, వాఙ్మయములలో బోధన యివ్వబడును. ఈ పరీక్షకోర్సు రెండు సంవత్సరములు. కళాశాల గురుకుల పద్ధతిని నడుపబడును ఉపాధ్యాయులు, విద్యార్థులు హాస్టల్సులో ఉండెదరు. ఈ కళాశాల దక్షిణభారత హిందీ ప్రచార సభ యాజమాన్యమున నడుపబడును.

హిందీ విశారదగాని, బి. ఎ. పార్టు III లో హిందీ ఐచ్ఛిక విషయముగ డిగ్రీగలవారు, 18 సంవత్సరములు పైబడిన వారు మాత్రము ఈ కళాశాలలో చేర్చుకొనబడెదరు. దక్షిణాది, మదరాసు నగరములనుండి పంచముంది విద్యార్థులు చేర్చుకొనబడెదరు. దరఖాస్తులు ఏప్రియల్ 15 లోగ "ప్రిన్సిపాల్, హిందీ మహావిద్యాలయ, విద్వాన్, పామర్రుపోస్టు, కృష్ణాజిల్లా"కు అందవలెను.

# నర్సరావుపేటలో పండిత పరిషత్తు

నర్సారావుపేట, ఏప్రిల్ 1: గత నెల 25, 26, 27, తేదీ లందు యిక్కడ పండిత పరిషత్తు జరిగెను. కీ. శే. శ్రీ బెల్లంకొండ రామరాయక వీంద్రులు రచించిన భాగవత చంపూ వ్యాఖ్యానమును శ్రీ తాడేపల్లి వెంకటనారాయణ శ్రేష్ఠిగారు ముద్రింపించి, పరిషత్తులో సమర్పించిరి. శ్రీ కాశీకృష్ణాచార్యులు, జమ్ములమడక మాధవరామ శర్మ, జో. సత్యనారాయణ, వారణాసి సుబ్రహ్మణ్య శాస్త్రి, మొదలగు పెద్దలు ప్రసంగించిరి. శంకర సిద్ధాంతమును స్థిరీకరించుటకు రామరాయకవిగారొనర్చిన కృషి అపారమనియు, సాహిత్యమున సహితము వారిపోకడ అసదృశమనియు, వీరు సుమారు 150 గ్రంథములు రచించినట్లు తెలియుచున్నదనియు, అందుకొలది గ్రంథములుమాత్రమే ముద్రింపబడినవనీ తక్కినవి కూడ ప్రచురించుట దేశమునకు గొప్పవాఙ్మయాభివృద్ధిదాయక మనియు చెప్పిరి.

## విజయవాడ వాణిజ్య సంఘం

విజయవాడ, ఏప్రిల్ 3: స్థానిక వాణిజ్య సంఘం (కమర్షియల్ అసోసియేషన్) సర్వసభ్య సమావేశం మొన్న జరిగినప్పుడు గోపు శేషావతారంగారు అధ్యక్షులుగను నూతలపాటి సుబ్బారావు గారు ఉపాధ్యక్షులుగను, అనుమాల శెట్టి శ్రీరాములు గారు కార్యదర్శిగను, గోపిసెట్టి వెంకట సుబ్బారావుగారు సంయుక్త కార్యదర్శిగను, బచ్చు కృష్ణయ్యగారు కోశాధికారిగను ఎన్నుకోబడిరి.

# శ్రీ తాళ్లపాక అన్నమాచార్యోత్సవం

## రెండవనాటి కార్యక్రమం

తిరుపతి, ఏప్రిల్ 3: శ్రీ తాళ్లపాక అన్నమాచార్యోత్సవం సందర్భమున నేడు రెండవరోజు ఉదయం శ్రీ పిరట్ల శంకర శాస్త్రి, రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ, ప్రయాగ నరసింహ శాస్త్రిగార్లు అన్నమాచార్యులచే రచింపబడిన కీర్తనలను సంకీర్తనచేసిరి. సాయంకాలం శ్రీమతి టి. సూర్యకుమారి, శ్రీమతి డి. శ్యామలాదేవి, శ్రీమతి సీతాలక్ష్మిగార్ల పాటకచ్చేరీలు జరుపబడినవి. వేలకొలది ప్రజలువచ్చి ఆనందించిరి.

## హిందూమత వేసవిపాఠశాల

తిరుపతి, ఏప్రిల్ 2: తిరుమల తిరుపతి దేవస్థానం కమిటీవారు మే 2 మొదలు 6 వారములు హిందూమత వేసవి పాఠశాలను నడుపబూనుచున్నారు. ఉపన్యాసములు తెలుగులోను, తమిళంలోను, ఇంగ్లీషు లోను ఉండును. ఈపాఠశాల కళాశాలల్లోని, పాఠశాలల్లోని, ఉపాధ్యాయుల ఉపయోగం కొరకు నడుపబడనున్నది. కాబట్టి దీనిలో చేరదలచినవారు శ్రీ వెంకటేశ్వర ప్రాచ్యకళాశాల డైరెక్టరుగారికి దరఖాస్తు చేయవచ్చును. అని తిరుపతి దేవస్థానం కమీషనర్ గారు వ్రాసిరి.

# ప్రజలకుసౌకర్యాలుకల్పించకుండా హెచ్చుపన్ను విధించుట అన్యాయం

## రాజమహేంద్రవరం పురపాలక సంఘ విధానంపై పౌరుల తీవ్ర అసంతృప్తి

రాజమహేంద్రవరం, ఏప్రిల్, 2: నిన్న సాయంకాలం పురమందిరంలో శ్రీ సోమిన కామేశ్వరరావు (మాజీ పురపాలక సంఘాధ్యక్షులు) గారి అధ్యక్షతను జరిగిన పౌరమహాసభలో, పురపాలక సంఘంవారు పన్నులు హెచ్చించుటను విమర్శించుచు పలువురు ప్రసంగించిరి. పురపాలక సంఘచర్యలవల్ల ప్రజలు అనేక యాతనలకు గురి కావలసి వస్తున్నదనిరి.

అధ్యక్షులు ప్రసంగిస్తూ, పురపాలక సంఘంవారు ప్రజలపై భరించరానంతగా పన్నులు విధించారనీ, యీ అన్యాయాన్ని ఎదుర్కొని ప్రజలకు న్యాయం కల్గించుటకును, యికముందు యిటువంటివి జరుగకుండా చూచుటకును ఒక పౌరమహాసంస్థను స్థాపించుట ఆవశ్యకమని హెచ్చరించిరి.

నిడమర్తి వెంకట్రామయ్యగారు మాట్లాడుచు పురపాలక సంఘ ఉద్యోగులెవ్వరూ సరిగా పనిచేయుట లేదని విమర్శించిరి. బోడపాటి రామలింగంగారు మాట్లాడుచు పురపాలక సంఘాధికార్లు విషయములను స్వయంగా పరిశీలించకుండా సమాస్తాలు చెప్పిన వాటిమీద ఆధారపడి ప్రవర్తించుచున్నారనీ, యిందువలన పన్నులు హెచ్చింపబడుచే తార్కాణమని చెప్పిరి.

మద్దూరి హనుమంతరావుగారు ప్రసంగించుచూ పురపాలక సంఘవారు హెచ్చు పన్నులు విధించినను నీరు, వెలుతురు మొదలైన కనీసపు సౌకర్యములైనను ప్రజలకు కల్గించిన పాపానపోలేదనీ, అట్టిదేమియు లేకుండగా పన్నులు మాత్రం విపరీతంగా హెచ్చించి ప్రజల్ని బాధించుటకు మంచిది కాదనీ, చెప్పిరి. టి. రామచంద్రరావుగారు మాట్లాడుచూ గత సంవత్సరం తీసివేయబడ్డ సుడిసెపై యీ సంవత్సరం మునిసిపాలిటీ వారు పన్ను హెచ్చించుచూ నోటీసు యిచ్చిరనీ, సుడిసె లేకపోయినను పన్ను విధించుటను బట్టి చూడగా పురపాలక సంఘ ఉద్యోగులు అధికార్లు యెంతో మెలకువతో ప్రజాసేవ చేయుచున్నారో తెలియుచున్నదనీ, చెప్పిరి.

ముట్నూరి సోమసుందరంగారు మాట్లాడుచూ "డిఫ్తీరియా" అనేవ్యాధి కొత్తగా యీ పట్నంలో వ్యాపించి ఒకేవారములో కొందరు మరణించిరనీ, యీ అంశము మునిసిపాలిటీకి తెలియజేయగా అది అంటువ్యాధి కాదనివారు జవాబిచ్చి అవిషయంలో అశ్రద్ధ వహించిరని, అదేమివ్యాధియో తెలియ చేయుమని వైద్యుల నడుగగా అదిచాలా ప్రమాదకరమైన అంటువ్యాధి అని కల్నల్ రాజు గారివంటి ప్రముఖ వైద్యులు తెల్పిరనీ చెప్పి, యిదంతయు ఆరోగ్య శాఖాధికారి అజాగ్రత్త అనిరి. ఈ విధముగా ప్రజలను బాధించుచున్న అనేక సమస్యల నెదుర్కొని న్యాయము జరిపించుటకు పౌరమహాసంస్థ అవసరమనికూడ వారు వివరించిరి. అంగర నరసింహారావుగారు ప్రసంగించుచూ పురపాలక సంస్థవారు పన్నులు విధించుటలో యేనియమములకు కట్టుబడక తమకుతోచినట్లు పన్నులు విధించిరనీ, వెంటనేవానిని రద్దుచేయించుటకు యీ సంఘమువారు కృషిసల్పి అవసరమైతే ప్రభుత్వమువద్దకు రాయబారము వెళ్లి తిరుచక్కగ్రైకొనవలెననీ హెచ్చరించిరి. పురపాలకసంస్థ చర్యలను ఖండించుచూ పి. హనుమంతరావు, వై. వెంకటరావు, వై. లక్ష్మణరావు, యస్. వి. రామారావుగార్లుకూడా ప్రసంగించిన పిమ్మట, సోమిన కామేశ్వరరావుగారు అధ్యక్షులుగను, యస్. వి. రామారావు, యస్. వి. సుబ్బారావుగార్లు కార్యదర్శులుగను పౌరమహాసంస్థ స్థాపించబడెను ఈ అంశములన్నియు అవసరమును బట్టి ప్రభుత్వమునకు తెలియజేయుటకు అడ్హాక్ కమిటీకూడ నియమించబడెను.

ఈ పురపాలక సంఘంవారు విపరీతంగాను, అశాస్త్రీయంగాను తమకుతోచినట్లు పన్నులు హెచ్చించినందుకు నిరసన తెలియజేయుచు ఒక తీర్మానం చేసిరి. ఈ విషయమును ప్రభుత్వము వారికి, పురపాలకసంస్థ వారికి తెలియజేసి పురజనులకు పరిహారమిప్పించుటకు పౌరమహాసంస్థ కృషి చేయవలెను.

పన్నుల విషయంలోనే గాక యితర అన్ని విషయములలోను ప్రజలకు తగిన సౌకర్యములు కల్గునట్లు సంస్థ మెలకువతో గమనించవలెను. ఈసంస్థలో ఒక్కొక్క వార్డునుండి ఇద్దరుసభ్యులను కార్యవర్గము లోనికి చేర్చుకొనవలెను. అని తీర్మానించిరి. (స్వ. వి.)

# నాజీల వినాశనానికి మాంత్రికుల తోడ్పాటు

లండన్, ఏప్రిల్ 3: యుద్ధ కాలంలో కెయిరోలో ఒక రహస్య కార్యాలయం నుండి పనిచేస్తూ ప్రపంచంలోని ప్రముఖ మాంత్రికులలో ఒకడైన జాస్పర్ మాస్కెలీన్ గారు హిట్లర్‌ను ఓడించడానికి తన మంత్రశక్తిని వినియోగించారు.

మాస్కెలీన్ "మాజిక్" ఆయుధాలను నిర్మిస్తున్నాడని విని హిట్లర్ నవ్వాడని మాస్కెలీన్ గారు తానిప్పుడే ప్రచురించిన పుస్తకంలో ప్రకటించారు. కాని హిట్లర్ ఈ ఆయుధాలవల్ల కలిగే అపాయాన్ని త్వరలోనే గుర్తించాడట. వెంటనే మాస్కెలీన్‌కై అన్వేషణ ప్రారంభించింది.

మాస్కెలీన్ కృత్రిమ టాంకులను, తుపాకులను, తుపాకి గుండ్లను, సైనికులను కూడా తయారు చేశాడు. ఆయన ఒక జలాంతర్గాముల దళాన్నికూడా నిర్మించాడు. ఈ బొమ్మ జలాంతర్గాముల పొడవు 250 అడుగులు. ఇవి నాజీలను మోసపుచ్చగలిగాయి. ఆయన మిత్రదేశాల గూఢచారులకవసరమైన పరికలను కూడా తయారు చేశారు. మాస్కెలీన్ "మాజిక్" ఆయుధాలవల్ల ఎందరో జర్మన్ గూఢచారులు చంపబడ్డారు.

మాస్కెలీన్ తనపనిని అతిరహస్యంగా ఉంచాడు. ఆయన స్వయంగా తన కార్యాలయాన్ని ఊడ్చుకు నేవాడు.

# ఆంధ్రరాష్ట్ర నిర్మాణం

(1-వ పేజీ తరువాయి)

జిల్లాలు పన్నెండింటికీ ఒక ప్రత్యేక పరిపాలన, ఇప్పుడు చెన్నరాష్ట్ర శాసన సభలలో ఆ జిల్లాలకు చెందిన సభ్యులతో శాసనసభ ఏర్పడాలనీ, హైకోర్టుమాత్రం అందరికీ ఉమ్మడిగా ఒక్కటే - మొన్నటి వరకూ బీహారు - ఒరిస్సా రాష్ట్రాలకు ఉన్నట్లు - ఉండాలనీ ఈ ఈ రిపోర్టులో సూచింపబడవచ్చును.

శాసనసభకు సంబంధించి ఒక చిన్న సమస్య ఏర్పడవచ్చు. మొత్తం చెన్న రాష్ట్రానికి ఇప్పుడు ఎగువ, దిగువ శాసన సభలున్నవి. అదేవిధంగా ఆంధ్రరాష్ట్రానికి రెండు శాసనసభలు ఉండాలా అన్నది ప్రశ్న. నూత్న రాజ్యాంగని బంధనల ప్రకారం కేంద్రశాసనసభలోని ఆప్రాంతీయ సభ్యులు తమకు రెండు శాసనసభలు కావాలనే పక్షంలో అలాగే ఏర్పాటు చేసుకోవచ్చును. అవిధంగా ఆంధ్ర సభ్యులు రెండు శాసన సభలుండాలని తీర్మానిస్తే ఆంధ్రకు రెండు శాసనసభలు ఇప్పుడే ఏర్పడవచ్చును, అవిధంగా ఏర్పడే ఎగువ శాసన సభలో ఇప్పటి ఆంధ్ర సభ్యులే సభ్యులుగా ఉండవచ్చును, లేదా అసలు అలాంటిదేమీ ఉండనవసరం లేకపోవచ్చును, ఆగస్టు 15, 1947 లో కౌన్సిల్ ఆఫ్ స్టేట్ రద్దయినట్లే ఆంధ్రకు సంబంధించి ఇది రద్దు కావచ్చును. ఆంధ్ర కొత్త రాష్ట్రం గనుక ఇప్పట్నుంచే ఇంత ఆడంబరం, అదనపు వ్యయం ఎందుకని కొందరు అభిప్రాయపడుతున్నారు

ఇక గవర్నరు విషయం. ప్రస్తుతానికి రెండు మంత్రివర్గాలకూ ఒకే గవర్నర్ ఉండవచ్చే సాధ్యంగా కన్పిస్తుంది ఖర్చు దామాషాగా రెండు ప్రభుత్వాలూ భరింపవచ్చును.

చెన్నపట్నం విషయంలో ఏం జరుగుతుందో ఇంకా స్పష్టంకాలేదు. ప్రస్తుతానికి ఆంధ్రప్రభుత్వం నగరంలోనే ఉండి వ్యవహరిస్తుందనడం నిర్వివాదం. ఆదాయ పుపన్న పంపకం, నగరంలో విశ్వవిద్యాలయ సరఫరాలవల్ల ఇప్పటి ప్రభుత్వానికి వస్తున్న ఆదాయం, కార్పొరేషనుకు ప్రభుత్వం ఇస్తున్న గ్రాంట్లు, అప్పులు వగైరాల విషయం కొంతవరకు క్లిష్టంగా పరిణమింపవచ్చును. అన్ని నగరంలోని జనాభానుబట్టి ఉభయ ప్రభుత్వాలూ దామాషాగా భరించడం ప్రస్తుతం ఆచరణయోగ్యం అని ఇక్కడ తలంచబడుచున్నది.

ఈ వివరాలన్నీ తయారుకావడానికి ఒకటి రెండు మాసాలు తప్పకపడుతుంది. ఆ తరువాత ఏర్పాట్లు అమలుకావడానికి ఒకమాసం పట్టవచ్చును. 1949 ఆగస్టు 15 నాటికి ఆంధ్రప్రాంతాలకు ప్రత్యేక పరిపాలన ఏర్పడగలదనే ఇక్కడ విషయజ్ఞులు భావిస్తున్నారు.

"ఆంధ్రరాష్ట్రం" ఇంత త్వరగా ఏర్పడడానికి కాంగ్రెస్ అధ్యక్షుడు డాక్టరు పట్టాభిసీతారామయ్యగారు చాలావరకు కారకులని చెప్పవచ్చును. 290 నెంబరు ప్రకారం రాష్ట్రం ఏర్పడేందుకు వీరు అంగీకరించి, సరిహద్దుల నిర్ణయం, ఆ తరువాత జరగడానికి సమ్మతించినందువల్ల ఇది సాధ్యమైందని చెప్పవచ్చును.

# 'సంయుక్తమహారాష్ట్ర స్థాపనావకాశం లేదు'

## కాంగ్రెస్ ఉపసంఘ నివేదికపై వ్యాఖ్య

బొంబాయి, ఏప్రిల్ 4: కాంగ్రెస్ అగ్రనాయకత్రయ నివేదిక అంశములు తెలిసినవారు ప్రస్తుతం సంయుక్త మహారాష్ట్ర స్థాపన జరిపే అవకాశంలేదని భావిస్తున్నారు. థార్ కమిటీ నివేదిక విచారణకు జయపూర్ కాంగ్రెస్ ఈ సంఘమును నియమించుటవల్ల ఆ సమయాన్లో మహారాష్ట్రులకు ప్రత్యేకరాష్ట్ర రాగలదను ఆశకలిగెను. ఈ కాంగ్రెస్ ఉపసంఘ నివేదికవల్ల ఆ ఆశలన్నీ నిరాశలైనవి.

ఈసంయుక్త మహారాష్ట్రమును కోరుచున్న వారలకు దేంజిన మముకరు ఈ విధంగా చెప్తున్నారు: "ఆంధ్ర రాష్ట్రము బహుశః కర్నాటక, కేరళ రాష్ట్రములు కూడా అనతికాలములోనే ఏర్పడవచ్చును కాని సంయుక్త మహారాష్ట్ర నిర్మాణం మాత్రం ఇప్పుడుజరిగే ఆశలేమీ కన్పించడంలేదు." కాంగ్రెసు అగ్రనాయకత్రయ ఉపసంఘం నివేదిక కేంద్ర కాంగ్రెసు కార్యవర్గం చర్చించిన తర్వాత వెలువడుతుందని తెలుస్తున్నది.

# కన్నడులకు జీవన్మరణ సమస్య

## బొంబాయి మంత్రి ప్రకటన

బొంబాయి, ఏప్రిల్ 4: కర్నాటక ఏకీకరణ కన్నడులకు జీవన్మరణసమస్య. వారి ఆశయము శీఘ్రకాలములో సిద్ధించగలదని బొంబాయి వ్యవసాయ మంత్రి ఎమ్. ఎ పాటిల్ గారు, కర్నాటక ఏకీకరణ సంఘమువారు ఏర్పాటుచేసిన సభయందు ఉద్ఘాటించిరి. థార్‌కమిటీవారు కర్నాటకులకు అన్యాయము చేసిరని సభకు అధ్యక్షతవహించిన హాగీర్‌దార్ గారు చెప్పిరి.

# చంద్రనాగూరు భవిష్యత్తు

## మునిసిపల్ అసెంబ్లీ తీర్మానము

చంద్రనాగూరు, ఏప్రిల్ 3: చంద్రనాగూరు భవిష్యత్తు విషయమున జరుపు జనవాక్య నిర్ధారణ సమయమున భారత ప్రభుత్వమును పరిశీలకులను పంపవలసినదిగ కోరుటకు మునిసిపల్ అసెంబ్లీ నేడు తీర్మానించెను. జనవాక్యమునందు కాకుండ చంద్రనాగూరును భారతదేశముతో సమ్మేళనము చేయవలెనని భారత ప్రభుత్వమును గ్రహించి ప్రభుత్వమును కోరుచు గతరోజున తీర్మానించెను. జనవాక్య నిర్ధారణ జరిగి తీరవలెనంటె జూన్ 19 న జరుపవలెనని నిర్ణయించెను.

చంద్రనాగూరు జనాభా 53000 అందులో 15 వేలమంది పాల్గొనెదరు.

# శ్రీ రాజేంద్రప్రసాద్

మద్రాసు, ఏప్రిల్ 4: గాంధీనిధి వసూళ్లకొరకు శ్రీ రాజేంద్రప్రసాదుగారు ఈనెల 3 వ వారములో తమిళనాడు నందు సంచారము చేయుదురు.

# కాంగ్రెస్‌వాదులు వెనుకటి త్యాగ నిరతిని, నైతికవర్తనాన్ని వదలరాదు

## సంయుక్త రాష్ట్ర కాంగ్రెస్ సేవకులసభలో ప్రస్తుత విషమస్థితుల సమీక్షిస్తూ నెహ్రూ హెచ్చరిక

లక్నో, ఏప్రిల్ 3: సంయుక్తరాష్ట్రముల కాంగ్రెస్‌వాదుల సమావేశంలో కాంగ్రెసు ప్రతిష్ఠనుగూర్చి, కర్తవ్యమును గూర్చి మాట్లాడుచు పండిట్ నెహ్రూ ఇట్లా అన్నారు.

"కాంగ్రెస్‌వారు ఒకవిధంగా స్వరాజ్యమును సాధించినట్లే. కాని ఈ స్వరాజ్యం రాజకీయ స్వరాజ్యము మాత్రమే. ఆర్థికంగా ప్రజలు ఏమీ సుఖించుటలేదు కాంగ్రెసువారు నైతికంగా పతితులగుచున్నారని ఇటీవల ఫిర్యాదులనేకంగా వచ్చుచున్నవి. కొందరు ప్రముఖులపై అన్నివిధములైన అపవాదులు వినవచ్చుచున్నవి. వారిపేర్లు పత్రికలలోనికికూడా ఎక్కినవి. ఇదేవిధంగా కొంత కాలం సాగితే మాపని అసాధ్యమై పోవును.

కాంగ్రెసువారి ప్రతిష్ఠ ఇంతకాలమూ అవిచ్ఛిన్నంగా వెలుగొందుటకు పండిట్ నెహ్రూ ఈ క్రింది కారణములను పేర్కొనెను.

"కాంగ్రెసు సంస్థయొక్క ఆదర్శముల తోను, లక్ష్యములతోను ప్రజలందరు ఏకీభవించిరి. ఇది మొదటి కారణము. అంతేగాక, కాంగ్రెసు సభ్యులు చేసిన అపార త్యాగములవలన, వారి నైతిక వర్తనమువలన ప్రజలకు వారిపై అఖండ విశ్వాసము కలిగెను. ఇది రెండవకారణము.

ప్రస్తుతం మనలను ఎన్నో విషమసమస్యలెదుర్కొనుచున్నవి. కాంగ్రెసు సంస్థయొక్క భవిష్యత్తు అంతలి 3, 4 వేలమంది పర్కర్ల నైతికవర్తనముపై ఆధారపడియున్నది. సిద్ధాంతరీత్యా అభిప్రాయభేదములున్నచో దానివల్ల హాని ఏమీ లేదు. కాని వ్యక్తిగత ద్వేషము, అసూయ ఇవి చాల హానికరముగ పరిణమించును. 2 నెలల నుండీ యు. పి. రాష్ట్ర కాంగ్రెసుపై నేనెన్నో అపవాదులు వినుచుంటిని. కాని ఇక్కడి కాంగ్రెసు నాయకులు ఇతర, రాష్ట్రముల వారికంటె ఎక్కువగా నైతికభ్రష్టులైనారని నేననుకోను. గను, పి. కాంగ్రెసువారిని చూచి నే నెప్పుడును గర్వపడుదును."

కాంగ్రెసువారిలోని అంతర్ద్వేషము మతవిద్వేషములు బోలియున్న వనికూడ పండిట్‌జీ తీవ్రముగా విమర్శించెను.

కాంగ్రెసువాది ఎవ్వడునూ తనతోటి సభ్యునిపై బహిరంగంగాగాని, రహస్యంగాగాని విమర్శను ప్రకటితం చేయరాదని, అట్టి విమర్శను చేయవలసివచ్చిన దానిని కాంగ్రెసుఅధ్యక్షునికిగాని మరొక అధికారవర్గానికిగాని సరాసరి పంపించవలసి యున్నదని, ఈ నిబంధన ఇప్పటికే కాంగ్రెసు నిబంధనావళిలో నే ఉన్ననూ ఈ దినమున దానినెవ్వరూ పాటించుటలేదని పండిట్ నెహ్రూ చెప్పుచు ఒక్కయు. పి. రాష్ట్ర కాంగ్రెసు కార్యవర్గం మాత్రమే నేడు దానిపై తన విశ్వాసమును పునః ప్రకటించినదని పేర్కొనెను.

కాంగ్రెసుపై దుష్కీర్తిపోయుట కొందరికి వినోదఖేలనముగా పరిణమించినదనీ, అవినీతి, బ్లాక్ మార్కెటింగుల నిర్మూలనమునకు ప్రభుత్వము తీవ్రకృషి చేయుచున్నదనీ, కాంగ్రెసు వారిలోకూడ కొందరు ఇట్టి దుష్కార్యాచరణలు లేకపోలేదనీ, కూడ పండిట్ నెహ్రూ అనెను.

### దేశమునకు వివిధ ప్రమాదములు

"ముస్లింలీగ్ వారి మతవర్గ విద్వేష విధానముపైననే పాకిస్థాన్ నిర్మింపబడినది. దేశ విభజనానంతరము రాష్ట్రీయ స్వయంసేవక సంఘము, హిందూమహాసభ, అకాలీపార్టీ మున్నగునవి ప్రబలి పెద్ద సమస్యలుగా పరిణమించినవి. ఆర్. యస్. యస్. వారి వైఖరి నే గనుక దేశము అనుసరించి యుండినచో, మన పెప్పడో నశించి యుండెడివారము.

### ప్రజల ఆర్థిక దుస్థితి

ప్రజల ఆర్థిక పరిస్థితిని చక్కబరచుటలో నా ప్రభుత్వము ఏమీ సాధింపలేకపోయినది. దానికి మొదటికారణము దేశ విభజనవలన తటస్థించిన విషమసమస్యల నెదుర్కొనుటతోనే మా కాలమంతయును గడచినది. రెండవది, ఆర్థిక సమస్యయందలి అసంఖ్యాకమైన చిక్కులు. మూడవది, ఉత్పత్తిని స్వల్పకాలమైన ఆటంకపరిచే ఏ తొందరపాటు చర్యనూ తీసుకొనకుండుటకు కాంగ్రెసు ప్రభుత్వములు ఇష్టపడకుండుట.

ఆర్థికంగా అభివృద్ధి కావలెనంటే అది అధికోత్పత్తివల్లనే సాధ్యమగును.

నిశ్చయంగా మనం కష్టముల నన్నిటినీ అధిగమించితిమి. వచ్చే 5, 6 నెలల్లో మనము చాలవరకు ఆర్థికంగా అభివృద్ధిని పొందగలము. అభివృద్ధిపథగాములమై చనెడి మన దేశమును ఏ ప్రపంచశక్తియును ఆటంకపరుపలేదు." అని పండిట్ నెహ్రూ తన ప్రసంగమును ముగించెను.

